# చంద్రశేఖరశతకము



పరిష్కర్త:
మున్నంగి ... శర్మ.

[వెల అ ౧ లు.

ప్రకాశకులు:
రామా అండ్ కో., ఏలూరు.

౧౯౩౭

# పీఠిక.

—:o:—

ఈ శతకము గ్రామ్యభాషయందు రచితమైనది; మూర్ఖసంభాషణపద్ధతిఁ దెల్పుట యుద్దేశ్యము. యతి—ప్రాసాదివృత్త లక్షణమునకు భంగ మొదవనీక చాలవఱకుఁ గాపాడఁబడెను. కర్త చతురుఁడు; లోకజ్ఞుఁడు; గ్రామ్యజీవనమునకును, తత్ప్రసంగాదికమునకును బాగుగ నలవడినాఁడు. తెలుఁగు సీమయందలి నానాప్రాంతములలో గ్రామ్యులు వాడు శబ్దములు పెక్కులు ఇందుఁ గలవు. ముఖ్యముగా పడమటిసీమ మాటలు ఎక్కుడు. నాకు శక్యమైనంతవఱకు వికారము చెందినవానికి ప్రకృతులం దెలిపి అర్థములును వ్రాసితిని; తెలియని వానినిఁ గొన్నిఁటిని వదలితిని. వ్యాకరణాదిలక్షణయుక్తముగ, వ్రాయుటకన్న గ్రామ్యభాషయందు ఇట్లు పద్యములు రచించుట దుస్తరము. రసజ్ఞులు, భాషాసంప్రదాయము నెఱుఁగఁగోరువారు గ్రామ్య

రీతులఁ దెలియ ముచ్చటపడువారు వేడుకకైన ఈశతకము జదువ నగును.

కర్త: ఈశతక కర్తృనామము ఎఱుకబడదు. ఇందలి శబ్దజాలమును గన్న పడమటి సీమవాఁడో నెల్లూరు మండలమువాఁడో ఐ యుండవలయును. కొన్నికడల ఉత్తరాదివాఁడుగఁ గూడఁ దలపించినాఁడు. "భాషీయదండకము" ననుకరించినదయ్యు ఇందును జాతీయమే కనఁబడుచున్నది.

ఏలూరు.
3—౨—3౨

పరిష్కర్త:
మున్నంగి ... శర్మ.

---

# చంద్రశేఖరశతకము

శ్రీగురుపాదుకాద్వయము జిత్తమునందుఁ దలంచి యాత్మవి
ద్యాగమభోగ మోక్ష విభవాతిశయైకషడూర్మి మాలికా
త్యాగ వియోగ భాగ కవితావినతానన మూర్ఖహృద్భయా
భ్యాగతశూలమో యన నయంబునఁ జెప్పెదఁ జంద్రశేఖరా.

కలుషమనోవికారులకుఁ గష్టులకున్ కుజనాళికిన్ కృత
ఘ్నులకును ధర్మశూన్యులకుఁ గుత్సితమానవకోటికిన్ మదాం
ధులకును సిగ్గువుట్ట మదిదూలఁగ నేరచియింతు నిన్ను ని
శ్చలమతిఁ జేర్చి యీశతకశాసన మిమ్ముగఁ జంద్రశేఖరా.

చాయడికాడ బాపనిపిసాసము పచ్చనిబియ్యా మేసి దీ
గ్గాయు వటాంటగూసె;-యెను సంటిన మేయము జారెనో! ఇనే
పోయినకన్ను వచ్చెనో! సమూలముగాఁ దలనొప్పి మానెనో!
ఏయెడ మేలుగాన" మని యేడ్చును మూర్ఖుఁడు చంద్రి...

౧. చావడికాడ... వెన్ను నంటిన మహావ్యాధి జారెనా?

"సీ దగిడీకె బాపలపసిద్ది సరే! పొగనిప్పు కంట సో
మాదుగులింటికోయి, బతిమాలితి;-మూడు నెగళ్ళుమండు త్రై;-
లే దని తిట్టె! పాపపుకలిగ్గము! ఇంతపరాక! దాఁట్లో దీ
రా దఁట!" యంఁ ద్రసభ్యులు దురాత్ములు మూర్ఖులు...

౨...బాపల ప్రసిద్ధి...సోమయాజుల యింటికిబోయి...మూడు అగ్నిహో
ములు (త్రేతాగ్నులు) మండుచున్నవి ... దానిలోనికి ఈయ రాదట! ...

"ఇస్త్రీని పారసాని కొట ఈయురిబాపల జందె మేసుకో
నిస్త్రీ, కుకుండ నిస్త్రీ, తిన నిస్త్రీని, బూమిలో బిచ్చ మెత్తుర్కో
నిస్త్రీ, పరుండ నిస్త్రీ, మన సిస్త్రీ, ఇదేయ మనిత్తె మంట ప
మిస్త్రీనో ఇస్త్రీ" నంచుం బలపించును మూర్ఖుండు... 3

3... ఈ దేహ మనిత్య మని.

"ఓరు తల్లోసి బామ్మచుల మోలునో! తండ్రి పరప్పతాప, నీ
పేరు ఉమాపతేనో! బప్ర పెద్దలు: పరోసతాని మొంగటా
శాదుల సుట్ల మానో! సరె బాడ తెలుస్తది!—అడ్డబొట్టు! నీ
పారుస మొల్ల బెట్టు" మని వాగును మూర్ఖుండు... ౪

౪...ఎవరో తాళ్లోసి (బ్రాహ్మణులంబోలెనో!... పర(ప్రతాప.....పరేశా
వధాని (ఇంటిపేరు).

"అద్దమ రేయి గొ ర్లరశినట్లు యసంగము వస్త దేందమే?
ఇద్దపురంగమో! ఇసంగ ఈరుల సుద్దులో! పంబనాదమో!
పొద్దన బాపనాండ్ల నెలి పొ మ్మని ఊ రెలగొట్టకుంటె నా
పద్దుకు దొడ్డమోస" మని వాగును... ౫

౫...వ్యాసంగము.

"కూసుత వేమి?- కుక్క నుసిగొల్పుదునా తలకిందు బాపండా?
మా సటవత్త రంట పలుమా రొదిరే వది నీ సబావమా?
దాసరి కోస్తి పొద్దనిత దప్పికి తోసినయట్లు; వట్టి యి
శ్వాసములేనిబాపం డని సణ్గును మూ... ౬

౬...మహాశతవృద్ధిరంట...పొద్దున (ఉదయమున) నే.

"కూసుట లేమి యీాదిబడి! కుప్పటగంతులదేమి! నామముల్
బూసుట లేమి! నెత్తి నొకబు ట్టదియేమి! శిరంగ మేమి! శీ

దాపరికొయ్యా! నిన్ను గని దద్దిరిపోతిని! మొన్నమట్టి ఈ
యేసము లేమి నీ" కని సడింతురు మూ... ౭

"పేలుత వేమి కాలకడ పెద్దబెరమ్మల మంట? కండ్లు పో
తైలె! పదేండ్లకింద నొకతయ్యేదు కీలసగడ్డ మెణ్ణి మో
సే లిటుజేస్తి; వాశరము కెక్కడిబద్దము? కూసినక్కగ
య్యాలిది;— తిట్టిపోయె" నని యాడును ... ౮

గా. పేలిుత వేమి కాళ్ళకడ పెద్దబాహ్మణులము అని?...కూసిన అక్క
(ఆమె) గయ్యాళిది.

"ఆరెవఁలంట!—మోపురుదురాచ్చలు, పూపిది వంట,నొష్టబల్
గో రెమసుక్క— నా గొడుక కూకొని రెప్పలు మూసి గొన్గుతా
మారికె తిత్తిలోన శెయి దూర్సుక! అక్కడ లేవ డొట్టియూ
గొరపువాలకం" బనుచుఁ గూయును... ౯

౯. ఆరాధ్య లంట! మోపెడు రుద్రాక్షలు, విభూతి ఒంటన్ (దేహాము
నను)...వాగుఒడ్డున...పట్టియఘోరపువాలకము...
"బుఱుపులకట్టె, బొంట యెలిబూడిదె, సేవలగుండ్ల పేరు, వో
లోపు, గోకకాయగుడ్డ—గని లోకులు నీమొగమీదవ్రాయ—సీ
కడనెడి జంగమోాడికొాడకా, ఎల గెంటుదు! నంతకాని, నీ
ముడు సిర గేతునా" యనుచు మోదును... ౧౦

౧౦...ఒక లాడుగు(=బొంతచొాక్కా)—య, కావిగుడ్డ, ... నీ మొగము మీద
ఉమ్మివేయ,. చీ కడచెడిన... వెళ్ళగెంటుదును (=వెడలత్రోయుదును) ...నీము
డుసు (= ముడ్డిపూస) విరగవేయుదునా? ...
"మొనగలకట్టి సంక, శిలిముంత, కసాయపుపాత— మొద్దులా
గున నవుదూత లంట! యిని గుంటను మెట్టు! తెలార లేశి నా
కనులతో సూస్తి పాపపు శికండిని! బోడిపిసాసి! నెట్ల ఈ
నిక? మిక మంచిగా" దనుచుం దిట్టును మా... ౧౧

౧౧...చిల్లిముంత, కషాయప్రపాత...అవధూత లంట! వీనినిగుంట(గోతిలో)ను బెట్ట!

"త్తా లట్టు! కర్త వేమి అయితద్దినమెల్లుడి యంట? మొన్నపై టాలను బాప లిద్దరికి డబ్బాకటి చొప్పకదండ మెట్టితే ఏలర బాపనాడ తెగసిల్లుత వేమి? ఇసారి కర్తై నీ కాలిరగేతు సూడు" మను కాపురుషుం డిల మూ... ౧౨

౧౨. తాళు (ఆగు) అట్లా కుస్తా వేమి?

"ఈసరబొట్ల యాగెతము! ఏకసినా డలరేవులోన ఏమాసా! తనాలకాడ బిగమట్టెను దారొాయ మంట! ఎంటనే మాసక తయ్యొడ్డోసె; తడిమాతనె నే నొకతయ్యొడ్డోస్తి; నా యాసక బాపనాడి" కని యొంచును మూ... ౧౩

౧౩. ఈశ్వరభట్ల అఘాయత్తము! ఏకాదశినాడు ... ఏమాళయో స్నానాల కాడ ధారపోయ మని బిగబట్టెను. ఎంటనేమాచక్క (అనునామె)తవ్వడు బోసె...

"యము డొాలె వచ్చి గుర్లు టు!-తయారుగకూకొానిపంచసంసకా
రములట! పూట్ను మంటాక సళాకున గాల్చెబుజాలమీాద;యే
సము! లొాకరూక దెమ్మని పసంగము సేసెను; మల్లికూస్తె నా
మము దుడిసేతు నంటి" నను మత్తుడు మూా... ౧౮

౧౮. యమునివలె వచ్చి గురువులట తయారుగ కూర్చొని పంచసంస్కారము (చక్రాంకితము) లంట! ...ఒకసళాకున (ఇనుపకాడతో) బుజాలమీాద గాల్చె! ఏమి యతని వేషములు! ఒకరూక (సంభావన) తెమ్మని ప్రసంగముచేసె...

"పాడు పిసాసి బాపడు సుబంబలె పెండ్లికి సావుదాన మం
టూ; డదె బెమ్మముడ్డి లొాకడబ్బ పిసూసుక కొంక మంట కూ
స్తా డినరానికూతలు! తదాస్తు లటం టని వాగు బాపనాం
డ్లెడక యేస మైరొా!" యని యేడ్చును మూా... ౧౯

౧౯...సావధానా అంటాడు. అదె బ్రహ్మముడిలో ఒకడబ్బు విప్పి చూచి కొంకుమ అంట కూస్తాడు వినరాని...

"పొద్దన యింతగా మయిపపుత్తురు దాంట దింయించి అబ్బకుర్
తద్దిన మంట! మాపొగుడుతా డదె బాపడు సైలకారిపె
ద్దెద్దొలె బట్ట సర్సుకొని! ఏందొ మ రొక్కటి వాగుతాడు ఏ
సుద్దము బద్ద మేడ" దని సొడ్డిడు మూ... ౧౬

౧౬. పొద్దున...మహిపపుత్తురిద అంట దీవించి... సైలకారిపెద్ద ఎద్దువలె బట్టసురుదుకొని...

"తడవుల కింద యాత్తరొయి తానలకాడను తిర్వతెంకటే
సుడి పుసుకారె సంట!— ఒక సోద్దెము సెప్పుత: సోబనాలయెం
బడి మడి నూకుతారు శెడుబాపలు దచ్చున లంట సేతులో
ఇసు ఇసు మంట సాస్త" రని యేమ్చును మూ... ౧౭

౧౭. (=చాలకాలము క్రిందట) యాత్రిపోయి స్నానాలకాడ తిరుపతి వెంకటేశ్వరుని పుష్కరిణి అంట– (అక్కడ జరిగిన) ఒకచోద్యము చెప్పుతాను– సోపానముల వెంబడి బడి...

"శరదగ యింటి నే పరమశాసతురాలిరతంబు; మూాడుసం
చరముల మట్టి శాస్త్రులు సక్కనగా తెలసెప్పె. మెచ్చి ని
బ్బరముగ నిస్తి ఓతులము పత్త్రాక దోతులసాపు కంట; మే
లెరగని జల్మ మేల?" అని యొంచును మూ... ౧౮

౧౮. శ్రిద్ధగా వింటిని పరమశాశ్వతురాలి వ్రితంబు- మూడుసంవత్సరముల బట్టి... తెలియ జెప్పె... ఒకతులము పత్తి ఒక ధోవతుల చాపున కని...

"పలసనిపుల్సు పప్పు నెయి పాశము పచ్చడి మేలుపిండివం
టలు తెగబెట్టి పట్ట మని నారెనబొట్లయబ్రాౖరె; ఇంత మా
యొలుపుగ సేసి ఒక్కతున కిస్తదిపో! నెల కేమతద్దినా
లలవడి వారు బాగుడలె" నందురు... ౧౯

౧౯... నారాయణభొట్లయ్యభార్య... ఇంత మహావెడలుపుగచేసి ఒక్కతునక... వారు బాగుగ నుండవలెను...

"గంటము పేర యింటను భగాతము సెప్పితె ఈదిలోకి ఓ
రా ఇలి సూస్తి నేను. ఇను: శేత్రి రమాంణేము బాగ సెప్పె! మా
యింటి: దురోదనుండు బవ్రయిద్ధ! మిబీసను శించి లంకలో
మా ఎగిలించి వచ్చె" నను మాంద్యేఁడు మూ...                ౨౦

౨౦...గంటముపేరయ్య (అనువాని) ఇంటిలో భాగవతము (పురాణము) చెప్పితే, వీధిలోకి ఎవ్వరా (ఈ చెప్పునది) అంటవెళ్ళి చూస్తి; రామాయణము బాగా చెప్పె; మహావింటిని—దుర్యోధనుని బహుయుద్ధము. (ఆ దుర్యోధనుఁడు) విభీషణుని చించి లంకలోనుంచి వెలిగించె...అనికథాసరి.

"కొందరు బాపనాండ్లు బరెగొడ్లలె సెర్మువెడ్డి సూసి తే
మందల వొండునీలు కసుమాలము సేసిరి యీాడ తాసమా
డాదరు; యీాండ్ల సందె జప మాపస నంటని చెప్పుతారు యీా
గుడుల కెక్క" రాచు పలవించును మూ...                ౨౧

"పెద్దలు శెప్ప గింటిః బవుపె ద్దట! యెగ్గసామాందులంట! బల్
గద్దరి! కోడెయాటలను కంబముకాడ మరుండ మెట్టి యా
డిద్దరు లోన ఓమ మట ఏకముగా కొదపెట్టి బాపనాం
డ్లొద్దాలమోాలెతిందు" రని యెన్నును మూ... ౧౨

౧౨. పెద్దలు చెప్పగా వింటి బహుపెద్ద యట, యజ్ఞసోమయాజులట! బల్గద్దరి (=బలువిట్టుమైనవాఁడు)... (కయసుపోతేండ్లను యూప) స్తంభముకాడ పరుండబెట్టి అక్కడ ఇద్దరులోన(=లోపల)హోమ మట...

"రెడ్డి, డభోల్ డభోల్ హారిహారీయనిసూపుతమాసలార! మా
దొడ్డుగ ఆన్నె కూకునరు దొర్లదె! యాన్నె' యటంటనాడె మా
మెడ్డుగ! దొమ్మ రెక్కగను మించినఁగుద్దె మ రేడ లేదు! నా
తెడ్డొకబాప నిద్దె" లని తిట్టును మూ... ౧3

౧3. దొమ్మరవానిమాటలు: రెడ్డి, డభోల్ డభోల్...చూపు తమాషాలు ఔరా మహాదొడ్డగా అడనె కూసున్నారు దొరలు—అదె అడనె...

"సీతని యొకిపేర్బలి మిసేసముగా యిడ సూపి, రేపు క
న్నేతులసందు మూతరము నీగుగ బాగుడ దంట మొన్నపు
రోహితుడు సెప్పె లగ్గము కిరోదము వొక్కటె; బాపనాండ్లు మా
సేతులు సాస్త" రంటని వచించును మూ... ౨౮

౨౮. తా. సీతని యొక్కయు వెంకియొక్కయు పేరుబలములు (జ్యోతిషము) విశేషముగా ఈడ (=ఇక్కడ) చూచి, రేపుకన్యాతుల (నక్షత్రములు) సంధిలో ముహూర్తము...బాగుండ దంట మొన్న పురోహితుడు చెప్పె-లగ్నము:కు విరోధ మొక్కటె...మహాచేతులు చాస్తారు (దక్షిణలకై).

"ఊరికి శాయిబాటు మనడు త్తరపీదిని బాగసెప్పె; శీ
కూరమ మంట! బాప డిడ కూకొని యే లిడి లెక్క సూసి గా
శారము సెప్పె; పున్నె మని సక్కగ బోరిగి లేసి పోస్తి నా
శారెము వా" ణ్ణటంచు వెసఁ జాటును మూ... ౨౯

౨౯...శ్రీకూర్మమంట ఒక బాపడు ఈడ కూకొని (వేలిడి వేళ్లు పెట్టి...గ్రహచారము చెప్పె...బోరల వేసి నాచేరెము ఒడినిండపోస్తిని...

"సెప్పితె పెగ్గె;- నేను తొలి సేసిన పున్నెము! కుండ లంటితే
తప్పు సలేంద్రలోన; శనతాగితి సత్రపుబాపనాడు నా
దోప్పెడు బోసినాడు; ఇను, దోసము లే దట! పుల్లసీల దో
శప్పను లచ్చిమే" మనుచుఁ జాటును మూ... ౨౬

౨౬............పుల్లసీళ్ళదోసె (అట్టు)అప్పము లక్ష్మీ షేమి?...

"రాతిరి శెప్పె గాడదపురాండములోని శరండ మెత్తి మా
యీతముగానె బాపడు; పెదింతది పస్తక ముంట గట్టిదో
సూతరగంటు; ముప్పిరిన సొప్పడి యేసితె మూడుబార్లపై
సేతెడు పగ్గ మగా" ననుచుఁ జెప్పును మూ... ౨౭

౨౭. తా. రాతిరి (ఒక) బాపడు మహాహితముగానే గరుడపురాణములోని చరణ (పాద) మెత్తి చెప్పె. పెద్ద ఇంతపుస్తకముంట గట్టె ఇనో సూత్రాంటులో; (ఆదారమును) ముప్పిరిగా పేనితే మూడుబార్లమీద చేతెడు పగ్గ మాను...

"గొబ్బునవచ్చి కూకొని సిగోమమటాటను, యొగ్గ మంట! నీ
కబ్బురమా పెదెఁకి, ఇది యత్తముగాదు. నిరత్తకఁబుగా
దబ్బున గొర్లమట్టుకొని దాం దెతి సూడక కోస్త; రొట్టెత
బ్బిబ్బులసోమయాతు" లని పేలును మూ...    ౨౮

౨౮...'శివోహ' మ్మటంటను, యజ్ఞ మంట (ఇది)నీకు అబ్బురమా? పెద్ద వెంకీ ఇది అర్థము గాదు నిరర్థకంబుగా దబ్బ (కటాల) న గొఱ్ఱెలను పట్టుకొని దానిది ఎత్తిచూడక కోస్తారు-వట్టి తబ్బిబ్బుల సోమయాజులు...

"వాగకు!— మొన్నకూతురిఇవాగము కొస్తివి సోలెడిస్తి; నీ
రోగమొ నీ వుమాదమొ ఇరుద్దము! లాసనబేద మంట! ఈ
లాగున మళ్ళి వస్తివి బళాబళ! సేతడి యారలే; దిదే
మాగడ మంకుబొట్లు! పద" మందురు మూ.    ౨౯

౨౯...విరుద్ధములు ఆశ్రమభేద మంట...చేయి తడియాలేదు ఇదేమి యాగము అంకుభట్లూ పద (నడు—వెళ్ళిపో)...

"కొద్దిది సంకపస్తకము గోతరకండమొ! బాగతంబొ! ఈ
మద్దెను పేరిశాతుర్రిలు తమాసగ కోయిల లాలకించ మా
ముద్దుగ సెప్పె! అంతకన మొగ్గుగ బైనిడికొండ డెల్లబల్
సుద్దులు సెప్ప గింటి" నని సొకుటను మూ. ౩౦

౩౦. తా. చంకలోనిపుస్తకము కొద్దిది (అది) గోత్రఖండమొ భాగవతమొ!...
అంతకన్న మొగ్గుగ బైనీడికొండడు ఎల్ల(అంతయు) సుద్దులు చెప్పగా వింటిని...

"మొన్నటి ముళ్లకట్టె, పదమూడుదినాలూ తనాలు సేసి యా
తిన్నగ బాబు పేర్నొడివి, తిమ్మనబొట్లకు,— పంబకాండ్ల మొం
కన్నకు చెండి కెంకనికి,— కమ్మని సెంబెడుపాలు పప్పు నెయ్
నన్నపుబియ్య్య,— మిస్తి" నని సాటును మూ... ౩౧

౩౧. తా. ఔ పదుమూడు దినాలు స్నానాలు చేసి...తిమ్మనభొట్లకు
మొన్నటిముళ్ళకి కైనున్నూ,...బియ్యమున్న ఇస్తిని...

"నన్ను సదించె బాబు శివనాడు తమాసగ బాగతంబు రా
మాన్నెము బారతంబును తమాషును; కిందియి ముందె వచ్చు; నే
నిన్ని సదుండగానె బవు యెత్తము; వో రిక బాపనాండ్లు నా
కన్నను లో" జ్జటండు) పలుగాకులు మూ... 3౨

"సాలగ పస్తుతించి బవు సంపదదాముల నెంచుతావు, ప
ద్దేలకు యెనక-తీయవుర, దేన్నొ అరుస్తవు బట్ట నంట! నీ
లాలన సాలు! యేము టది? లచ్చలు నీయటివారు బూమిలో;
సీ లెగి సెల్లు పో" మ్మని వచించునుమూ... 33

33. తా. చాలగ ప్రస్తుతించి బహుసంపద్దాములని ఎంచుతావు. పద్యములకు వెనుక దీయవుర దేనినో (గూర్చి) అరుస్తావు-భట్టును అంటూ?

"చందము రుత్తలచ్చనము జాతులు వీరతి శక్రి) మాల్లు లా
సందులు దోస మచ్చులాడసారము సూసి కయిాసు నైతి; ఇం

పొందగ తిమ్మరాజుకత పూర్ణముగా వచనంబు సేస్తి; ఇ
ట్లందరు సెప్పనేర” రని యందురు మూ... ౩౮

౩౮..........విరతి(=యతి), చక్రిము పాల్లులు, ఆసంధులు, దోషము, అచ్చులు ఒడసారము (=పూర్తిగా) చూచి కవీశ్వరుడనై తిని.

“మూరెడు పెద్దపుస్తకము ముందరగానె సదించి, వెనక కా
కారగుణింత మోనములు గట్టిగ సెప్పలె తల్లకిందు; నీ
శారదమా ఇదేంది? ఇక సాలిచు! మొన్నటిమట్ట్ అచ్చరా
లూరక నేలపా” లనును నూరక మూ... ౩౯

౩౯.....క కారగుణింతము, ఒ న మః...

“ఇంటిని తిమ్మరాజుకత, ఇంటిని యీర్లకతాపసంగముల్
ఇంటిని పాండురాలిఱుబ, మింటిని నాయకురాలిశౌర్యె మె

ప్పంటికి సందివాక్యములపాడుచరిత్రిన నాకు భాగ్గ మె
న్నంటికిగల్గునో!" యను సవజ్ఞుడు మూ... ౩౬

౩౬......వీరుల కథా ప్రసంగముల్, ...పాండురాలి (పాండవులభార్య; పాంచాలి) విభవము,......సంధివాక్యములంబాడుచరిత్రి విన నాకుభాగ్యము ఎన్నంటికి?...

"సమ్మగ సెప్పె మారుసులజల్మముల; న్నిక సెప్ప తింటవా:
బెమ్మకు సిబ్బి, యీతని కిబీసుడు, వాడికి బల్లి, వాడి కో
కుమ్మరసామి, ఈతనికి కొండొలె బీముడు, కచ్చపుండు— మా
నెమ్మిగ బుట్టి" రంచు వచింయించును మూ... ౩౭

౩౭—మహాఋషుల జన్మములను ఇక చెప్పూతా వింటావా ? బ్రహ్మకు (పుట్టినది) శిబి, ఈతని (శిబి)కి ఇబీసుడు (విభీషణుడు), వాడి (అవిభీషణుని) కి బలి, వాని (అబలి) కొక కుమారస్వామి, ఈతని (ఈకుమారస్వామి) కి కొండవలె భీముడు, కచ్ఛపుడు; మహా నెమ్మిగ—

"మా కిన సెప్పె నోకత: శివుండనరాయిడికాడిశెంచు నా
పీకమలాన బుట్టె నలుబిడ్డ; లో కిద్దరు ముంగ, లాది బ
మ్మాకడసారి అంతకు శివుండనరాయిడి యాడఃమడ్డియా
సో కలిగింది చెప్పు?" మను సొక్కుచు మూ... ౩౮

౩౮—మాపు వినఁ జెప్పె నోకకత శ్రీమన్నారాయణుని కడనున్న చెంచు (యొక్క) నాభీకమలాన నలుబిడ్డలు (పుట్టిరి) (అందులో) ఒక ఇద్దరు ముంగల (ముందుభాగమునను) ఆదిబ్రహ్మ ఆ కడసారి—

"బాపడు వేశదేయ మట! ప స్తుట! దేము డెమేద్దె మాంట! సీ
రే పుసుకారె, బాపడ, సరే నరమేన సమస్తబాగ్గె మే
యేపుకు సావులేక మరి యేమిఁటి నీమొగ ముండ దాడ! నే
శేపిన యిన్గలే" వనుచుఁ జెప్పును నూ... ౩౯

కిః—వైశ్వదేవ మట!——దేవునినైవేద్య మట!—నీముఖము ఉన్నదా
ఆడ (అక్కడ)! నే చెప్పినను వినగ లేవు—

"పండినచేను నాది పడ బట్టుకపో, నెలనాడు నీవు పు
రాండను శెప్పి నాపుగద రమ్మేముగా: బగుమాన మిస్త; మా
ముండ యినాల నంట పడి మొత్తుక సస్తది; నీవు మల్లి రా.
మాండను నెప్పు" లంచు నను మందుడు మూ... ౪౦

"సోమడి శేయి లాబ; మది సోమిత లెందుకు? కోరు జల్లితే
బూమిలొ యాడలేను పసుమొక్కలు; పుండగ ఇంటి నిండ గ
డ్డాములు గూడ బండే; డియి దాపను శె య్యేరి గుండ దంట!
వే మొకసోలె డిస్త నడి సెల్లను మూ... ౪౧

౪౧......ఇంటినిండ గడ్డివాములు...ఇవి దాపను చెయ్యి విరిగిఉన్నదంటావు
ఏమో ఒకసోలెను ఇస్తాను నడిచి వెళ్ళు అనును...

"బాపడు మాంచివోడె అని బత్తిగ నే నటు శేనికాడ నా
కాపరమేశు డిచ్చినది కంచెడు కంకులు వోణ్ణిమో స్తి; సీ
పాపలమారికొయ్య! నిను బామడు సూసితె తన్నుతాడు; నీ
కాపుకు సిగ్గు లే" దనును కాపురుషుం డిల... ౪౨

"ఏసము లెయ్యమోకు మనయేపరియీరయ శెయ్యిసూచి మా
కాసలు యెల్లమెట్టె! మన కాస ఇుదేటొ తెలార్నె దాక! సీ
కాసుకు ఆసలేదు; మరి కర్రిరిసేస్తను; దొ డ్డికాడ పా
శేసిన ఆయు వుంటె బతికే" మను మూ... ౪౩

౪౩. వేషములు వెయ్యబోకు, మన వ్యాపారి వీరయ్య చెయ్యిచూచి మా కాళలు వెళ్ళ బెట్టె; మనకు ఆశ ఇ గేమిటో తెల్లవారినదాక! ......కళ్ల విరచి వేస్తాను (=కొట్టుతాను.)

"దుస్తుకు శేసి మొన్న తెగదొయ్యగ రాముడు పన్ను ఇచ్చె;
శిస్తుకు రూక లంట బలు శీదరపెట్టిన ఇయ్యజాలవా ?
శే స్తవు కాపరం బిగను! శేతికి బొం డొక శేశి నిన్ను తో
"శేస్తను కొట్టంలో" ననుచుం జెప్పను మూ... ౨౨

౨౨.............చేతికి బొంద (బొండకొయ్య; అరదండము; కఱ్ఱబేడి) ఒక
టి వేసి నిన్ను కొట్టు (ఖైదు) లో తోసి వేస్తాను.

వంటకు కట్టె లిస్తి, మరి బత్తుడవా నిను బొందమెట్ట, నా
గంటికి కొయ్య సూడు మని గంగని తిప్పితి మొన్నమట్టె! నా
శంటము ఏమి శేస్తివిర? శప్పర! కా లిర గేతు సూడు ! ఈ
కుం టిగ సావతన్దు" నని కూయును మూ... ౨౩

౨౩.............బత్తుడవా (వదరిబత్తుండవా? వదరింగివా?) నిను బొందలో
బెట్టా! నాగటి (నాగలి) కి......ఇయ్యకుంటే ఇక చావతన్నుదును !

"తమ్మడివొల్లు సూస్తె సలితాపము లంట: ఇ దేటి రోగమో!
తమ్ముడు ఊరలేడు; తమదాసరికూడు కులాన లేదు! సీ
కమ్మకులాని కిట్ల కడగండ్లు మ రుండవు! తేనె వస్తె నే
నమ్మను, అప్పు లీయ" నని యందురు మూ... ౪౬

"బాపడు లగ్గ మంట తెగబారెడు పస్తక మిప్పి సూసి, యే
ల్లేపి తమాస సూడు, మిదె లింగడిపేరుబలాన చల్లు మం
టాపతిపెట్టె నాకు! కొరగానికులం బిది నమ్మరాదు; ఓ
గాపెడుగింజ లైన మరి గా" వను మూ... ౪౭

౪౭.........వేళ్లు లేపి తమాష చూడుము– ఇదే లింగని పేరుబలమున (గింజలు) చల్లుము అంట ఆపద పెట్టె నాకు.

గుడగుడ రోజురోజు సకుకుంటడు బాపడు, పిచ్చిగుంట్ల నూ
కడు శెపినన్ని గోత్రలు గట్టిగ శెప్పునో! మీసముంగుగా

వడిగొని- సవ్వసాచి!- తలపట్టక శిందుపదాలు పాడునో!
గుడగుడె! వట్టిలొట్టు " యని కూయును మూ... ౪౮

౪౮. రోజురోజూ గుడగుడె చదువుకుంటాడుగదా(ఈ) బాపడు!-పిచ్చిగుంట్ల సూకడు (పేరు) చెప్పినన్ని గోత్రములు గిట్టిగ చెప్పునా? (ఆపిచ్చికుంట్లనూకనివలె) మీసము హాంగుగా ఎడవేసి సవ్యసాచి తలపట్టుకొని చిందు (ఆట) పదాలు పాడునా? ఈ బాపలది గుడుగుడే (గాని) వట్టిలొట్టు (వట్టిలొటారము) డొల్ల...

"సిద్దన నిన్న టేకువ అస్విత్థముకొమ్మనసేరి మేకతో,
ల, ద్దొకబోలె వెల్మిడి మొగా. నొకబోలెను రుద్దరాచ్చు, ల
ట్లొ ద్దెయినేసి ముక్కినిసి గొన్ని! నదేమి రకాసా! దయ్యమో!
మొద్దొ! పిసాసా! గామొ! " అను మూ... ౪౯

౪౯. సిద్దన (అను జంగము) నిన్నటి వేకువను అశ్వత్థము (రావిచెట్టు) కొమ్మ మీద చేరి, మేకతోలు, అద్ద, ఒకబోలెను వెల్మిడి (బూడిద)మొగాన, ఒక బోలెను

రుద్రాక్షులు, అట్లు (=ఆకీతిగా), ఒద్దెయి (=పెద్దవి) వేసి ముక్కు అణంచి గొణంగెను-
అ దేమి రాకాసియో, దయ్యమో..........గ్రహమో........

"ఆరు పదేనులై నలపయూరు, పదా రొకమాడ సాల, మిం
కా రెండు మూడు పద్దు లంయి గల్పితె డబ్బయె; కర్నమంట! నే
సేరనో! సెల్లు యే స్త నని సీల్గుత వేమిటి! శౌ లొండేతు! నీ
పోరాట ఇ దేందిలెక్క?" యని మూల్గును మూ... ౫౦

౫౦. ఆరు పదింహేనులు ఐ నలభైయారు పదహారు ఒకమాడ చాలము - ఇంకా
రెండు మూడు పద్దులు ఐ కలిపితే డబ్బయినది (లెక్క)..........చెవుయి ఒడియ
వేతునా (=నులుముదువా) ?

"సెప్పుకొరాము,—కోడలు నిసేకము సేసుత దంట! దీని బు
ద్దెప్పటి కింతే! రెండుతల పేర్పడి ముంతెడు నీలు మీాద ప
డ్డప్పటి కంట సెప్పు తిన నంటది! 'యెప్పటియేడు కప్పుడే
ఇప్పుడె కాని' మాట" దని మోచును మూ... ౫౧

గ౧..............ఎప్పటికేడక అప్పుడే (కాఇట్రి) ఇప్పుడే (నిషేకము) కానీ మంటుంది.

"పసము లేమి! సందెము తలాంటిక లేమి! ఇయొంటిబూడిదే! మానసలేమి! లేశి ఇటికానము కాడ కుకుందురోరి నా దోసెమురాగు లోస్త్ర, మరి దొడ్డయొగీసుడ వైతె ఇప్పుడే వాసిగ ఊరి కెల్లు" మని వాగును మూ... గ౨

గ౨.........ఈయొంటికి (దేహముకు) బూడిద యేమి! ఆసనాలేమి! లేచి ఇటుక ఆసము...... ...మరి దొడ్డ యోగీశ్వరుడ వైతే......

"ఊరికిబూసన మ్మాట పెదోరికి లేనిగునం! చరే సదూ కూరికె! సర్పవత్తి, యిపు డొక్కటి శెప్పర! పూరిదక్క; దా పూరణ మంటిశేను నిరమూలముసే సిక నాటు యేస్తుడం టీరముమాల్నికొయ్య" యని యెన్నును మూ... గ౩

౫౩. పెద్దవారికి లేనిగుణము ఊరికి భూషణ మ్మట. సరే చదవకుఊరికే (ఓ) సత్పురి త్తి-(సంబుద్ధి) ఇపు డొక్కటి చెప్పగా-పూరి (గడ్డి)వక్కడు; పూర్ణము వంటి చేను నిర్మూలముచేసి ఇక నాట (విత్తనమునాట) వేస్తా డంట వివరముమాలినకొయ్య...

"తిరలికడబ్బదొబ్బి బవు తెంపుగ సాలెకులాని కిందు, దొ
మ్మరలకు యాటబత్తె, మొకమానెకు బాపనబూరి, మేలుకొ
త్తరకముసేరె బోగముమదారికి, వీరడియుప్పపెండ్లి పె
ద్దరికముగానె సేస్తి" నను దబ్బరి మూ... ౫౪

౫౪, తిరువళిక (వీపకు—గరుడగంబము)లోని తిరువెపు కాసు నువెత్తుకొని బహు తెంపుగా: సాలెవలానికి విందు, దొమ్మర్లకు యాట(పొటేలు) బత్తె, మొక మానెకు బాపలకు భూరి దక్షిణ......

"ఇంతగ ఒంటి దీలకు మనింటిది సేసినవైభగంబు నే
నెంతని సెప్ప! సూశికొను ఏలెబు కాశిరపోయి రంట! నే

ము౹ తెడు నీలలోన ఒకముద్దపడే సిరిగారికెల్ల సా
ల్నెంతపరామరిస్తి" నని యాడును మూ... ౫౫

౫౫. ఇంతగా ఒంటిది (ఒక్కతయే) ఈలకు (వీళ్ళకు) మన ఇంటిది(పెండ్లము) ...వైభవంబు...చూచినవారు (ముక్కు-మూద) వేలుపెట్టుకొని ఆశ్చర్యపోయి రట! నేను ముంతెడు నీళ్ళలోన ఒక (సంకటి) ముద్దపడవేసి ఇరుగు (ఇంటిపక్క) వారికెల్ల చాలినంత పరామర్శిస్తిని...

"గుడివెనకాల ఇగ్గినము గు ర్లైనమెట్టుక తోక సాసి దో
సెకుపోయ మంట వొగ్గుతను చేతు;-లదేందది ఇంటివా? ఇనా
కుక్కడికొడు కాయిబీసనుడికూతురు కూనల యెంగటమ్మ అ
ల్లుడు తగసూడు" మంద్రు ధరలోపల మూ... ౫౬

౫౬. గుడివెనుకల (నుండు) విగ్రహము గుర్రిల్లు వెళ్ళబెట్టుకొని, తోకచాచి దోసెడు పోయ వని ఒగ్గుతాడుచేతులు. అదేంది అదివింటివా? వినాయకుని కొడుకు, ఆ విభీషణాని కోడ లగు కూనల వెంకటమ్మ అల్లుడు.

“అంచన లేవదీసి యిచు కైనటిపుట్లకు బాడి గెప్పరా
యించి శిపాయిబత్తెముల కెన్నున బం డాక చెత్తి కొట్టి నూ
కించుచు, మాన్యగాండ్ల నడగెంటుచు, పాదనపాండ్ల నూరిలో
కొంచుచు,-నా పబుత్వ” మని గొన్నును మూ. ౫౭

“ గంగడు, దొంగముత్తి పలుగాకి; పెదేగినబాముచూడ: గో
సంగి పిసాసిబిడ్డ బలుసావుసురాలు, పినాళ్ళతల్లి మా
బంగుడు తొత్తు; యింటగలపత్తవి ఇత్తరశీరదప్ప, నా
సంగతి యింటివా? ” అను నసారుడు మూ... ౫౮

“ పానము సమ్మ గుండె నట పాడుత ఆకుత దొమ్మరకిక్క న
న్నానికసేసి యెక్కిసపు; డబ్బుర ! మేదొకసీరె, యాటు, బ
త్తేనికి మాడ ఇస్తి. నది. తీరుపసాసక మాట గూస్త డీ
పీనిగ బాపనా ” డనుచుఁ బ్రేలును మూ... ౫౯

౫౯. ప్రాణముసమ్మగ (= సుఖముగా) ఉండె నచట పాడుచు, ఆడుచు దొమ్మర అక్కి (పేరు) నన్ను ఆనికచేసి (=ఊతముచేసికొని) (గడ) ఎక్కినప్పుడు అబ్బురము! ఏదో ఒకచీరయు, యాడు (గొర్రెపోతు)ను, భక్ష్యములను మాడయు... అని తీరు ప్రశంసకము అని చూస్తాడు ఈ పీనిగ...

" మాడకు వంగ మంట పదిమాత్రల లిచ్చె; పైవాతపిత్త మం

టూ డొల్లు సూశి! ముత్తిక! మనాడికి తాగుడు మద్దె; మాడింలు

ల్లూడిశి పెట్టె వైదుడు! న గొస్తది! రొ.డొనకాలు సూశి వొ

మాడను దెమ్మటూ" డనును మందుడు మూ... ౬౦

౬౦. మాడ (= నాణెవిశేషము)కు వంగ (భస్మము) అంట పదిమాత్రలు ఇచ్చె. ప్రవాతపిత్త మంటాడు ఒళ్లుచూచి! వృత్తిక (=మంటిబిడ్డ); మనవానికి తాగుడు మధ్యమము (=మట్టు); వాని (ఆరోగియొక్క) ఇల్లు ఊడ్చి పెట్టెను వైద్యుడు. నవ్వు వస్తుంది. రెండవకాలిని జూచి ఒకమాడను తెమ్మంటాడు వైద్యుడు.

" దస్తుర మొన్ననే బురళదాసళచేత గడించి నాట్టె మా
డిస్తిని చంగమొద్ద; తెలెడేస్తి నెయోస్తి, సమస్తబాగ్గె మే
డిస్తిని; వాండ్ల కయ్యెతలె; డేకనె జాండ్లకు సోల దారవో
యిస్తి యిసారి తేర " కని యెంచును మూ... ౬౧

౬౧.........సంగము (గ్రామము పేరు) వద్ద; తెలెదు వేస్తి (=కంచమంత)... నెయ్యి
పోస్తి; ...వాండ్లకు తెలె దయ్యెను. వేకువనె జాండ్రల (కులము) వారికి ...ఈసారి
తేరకు...

" సెట్టికి కోటిలాబసులు ! సీమకయిూస్రులెకాని పద్దెముల్
గట్టరు; పెండ్లికూతు రొకగట్టిది; శా లదె, అయ్యొ సద్దుకుం
టట్టె మబాగ వుంట దిక యూల సునామడి ? పెండ్లినాటికో
గొట్టము చేతి కిస్త " నని కూయును మూ... ౬౨

(3)

ఉ౨.........సీమకవీశ్వరులే కాని పద్యములు కట్ట(జాల)రు. కాలువ అదె అయ్యె సరుదు (=సవరించు) కుంటే అట్టె మహాబాగ ఉంటుంది. ఇక యేటికి సునామణి (=వినిపించుట)!

"కుక్కలదొడ్డి కాపురము, కోతులదాపర మూ, రుగాది నా
డక్కరతమ్మ శ్రేస్తి గురు డయ్యని, పున్నెము దారవోసె; నే
డెక్కడ తెత్తు; దయ్యమలె నేటికి వస్తి" వటంచు లేశి దా
కుక్కను మీదికట్టె నుసుగొల్పును మూ... ఉ౩

ఉ౩.........ఊరు ఉగాదినాడును అక్రితమ్మను గురులయ్యను (పూజ) చేస్తిని....

"ఇంటికి లేనివాజ మనయారడు పెత్తన మేడ్చి గామమా
మంటను గల్పె! రాశి కొంకమానెడు, ఇంటికి డబ్బు గూర్చి యే
యింటికి పంచిపట్టె! కులయినుడు! మాటల నేర! డింకయే
మంటవు యిల్లు గుల్లపడె" నందురు మూ... ఉ౪

౬౪. ఇంటికి లేని అలవాటు......గా్రామమునా మంటగలిపె. మొత్తముగా ఒక మానెడు (గింజలు)న్ను. ఇంటింటికి డబ్బు చొప్పున కూర్చి వేయింటి (వెయ్యమంది)కి... కులహీనుడు !...

"పట్టుపదేండ్లనుండి బవుపద్దెము లల్లితి; వినుతావు; యే
మెట్టను లేదు నీవు బగుమేలుగ యేసము లేసినావు? బా
గట్టుక మోస్కపో పిడికె డారికె లిస్త! గరించు మాట, ఇ
ట్టట్టు ఇసార మొ" ద్దనుచు నందురు మూ... ౬౫

౬౫.........బహుపద్యము లల్లితిని వింటావా ? ఎక్కడనూ లేద-నీవు బహు మేలుగా వేషము లేసినావు. బాగుగా కట్టుకొని మోసుకొనిపో-పిడికెడు అరిక (అరిక-ధాన్యము) లిస్తాను. గ్రహించుమాట. ఇట్లట్లు విచారము వద్దు .....

"అరడివొద్దు! మీరు గురులయ్యలు! యీాతము సెప్పుతా: పెద
మ్మారికి కోకపెట్టి భగమానము సేస్తి, తిరొంగలమ్మ కో

మూరెడు రైక కంటె తనముంగల శింపితి: నేడు ఇంటనే
నేరనికూతలా?" యనుచు నిక్కెను మూ... ౬౬

౬౬........విహితము చెప్పుతాను. పెద్దఅమ్మవారికి (గురువులయ్య భార్యకు) చీర పెట్టి బహుమానము చేస్తిని. తిరువెంగళమ్మకు రైకకు (కావలెను) అంటె తనముంగల మూరెడు (కొలిచి) చింపితిని. నేడు వింటూనే నేరని (తెలియని) కూతలా?...

"ఇంటిగదే పిసాసి మనయేపరి తిమ్మన సూశి ముట్టరా
దం టొకమాట సెప్పె: మడిదోతులు గప్పుత, రేవుకాడ మా
పొంటికి బోసుకొంట; బహుపున్నెము! ఏకశి దొడ్డ దంట! యె
ప్పంట్కి కిదేపకార" మని పల్కెను మూ... ౬౭

౬౭. వింటివిగదే పిశాచి! మనవ్యాపారి తిమ్మన్న చూచి ముట్టరాదని, మడిధావతులు కప్పుకొనుచు, రేవుకాడ మాపు ఒంటికి బోసికొనుచు ఒకమాట చెప్పె: బహు పుణ్య మంట! ఏకాదశి దొడ్డ దంట! ఎప్పటికి ఇదేప్రకారము...

"మొన్న పురిట్లో బోయిన పబుద్దుడు మాగుణవంతు! డాకలం
టెన్నడు యేడ్వ; డింత దపి కెన్నడు దెమ్మన; డొర్ల నెవ్వరిం
కన్నెత్తి సూడ! డింతకును గా బది కుండిన వాడు పెత్తనా
లెన్నెనొ సేసు" నంచు వచియించును మూ... ౬౮

ఉ.తా. మొన్న పురిటిలో బోయిన ప్రబుద్ధుడు మహాగుణవంతుఁడు; ఆకలి అని ఎన్నడు ఏడ్వఁడు; ఇంత దప్పికి ఎన్నడు తెమ్మనఁడు; ఒరుల నెవ్వరిని గన్నెత్తి చూడఁడు. ఇంతకును గా బ్రదికి యుండినచో ఎన్నెన్ని పెత్తనాలో చేయును...

"బాగుగ పారిజాతములొ పాతలవోమముష్టు ఇప్పి మొ
న్నాగుడికాడ బైనిడు: 'ఇనాక్కుడు తాటకి ముక్కు--శౌలు మా
యేగిర మంటగోసె' నని యుగ్రముగా తెలసెప్పె! దబ్బరా?-.
నాగురుడాన!" అందురు చెనంటులు మూ... ౬౯

ఓ౯. బాగుగా పారిజాత (గ్రంథ) ములోని పాతాళహోమపుపట్టు అగుడికాడ, శ్రైనీడు మొన్న వివరముగా తెలియఁజెప్పె. అందులో కథాస్వారస్య మే మనఁగా: వినాయకుఁడు తాటకి ముక్కు చెవులు అంటగోసె నని. దబ్బరా? (=అబద్ధమా?) నాగురునియాన (=ఒట్టు)

"రాత్రిరి సూస్తి యేసములు రమ్మేముగా గురులాన! మొన్న బా
గోతులసత్తెబామ ఇనగూడనితాపము లెల్ల సేసె! మా
పాతకురాలు! రాద వలపచ్చము, రుక్కిని సుద్ది కిష్ట, మీ
తెరుగానరా"దని నుతించును మూ... ౨౦

౨౦.........మహాపాటకురాలు. రాధవలపక్షము, రుక్మిణి సుద్దిక(మాటకు) ఇష్టము, ఈ తెరగు గానరాదు............

"ఇరియిగ సూస్తి తీరతము లెన్నోనో! యావనగొండగంగజా
తరసరిరావు; పాబలును తప్పెటలుల్ కొముగాండ్ల సిండ్ల సం

బర! మదిగాక ఇంకొక పెబావము: రంకులరాట మెక్కి. నే
తిరిగిన సాటిరా"దని నుతించును మూ... ౭౧

౭౧. విరివిగ చూస్తిని తీర్థము లెన్ని ఎన్నో......................
అదిగాక ఇం కొక ప్రభావము (ఏమనగా)............

"కలిగిరితీర్థమోయి ఒకకానిక యాపెరుమాళ్లకోయిలో
పల బడయేస్తి పట్టు మని పల్లెములో; తొలిశాకు దీసి శే
తులో బడయేశి పొమ్మనుచు దొబ్బె నోరే గుడినంబి యంట!యే
కులమో! ఇ దేల యిస్తి" నని గొన్గును మూ... ౭౨

౭౨...........కోవెలలోపల.........
"సేరున వాడవల్లి నరశిమ్ముడితీరతమోయి బోగమ
మోస్సరులయాట సూస్తి; దనిము గల దేము డ దెంత! ఇద్దెలో

తీరుపయాస గంటి; ఒకతి త్తి గుగిం తిప కూవె పానికొ
లూరక మొక్కబు ద్దెగు నహా!" యను మూ... ౭౩

౭౩..............విద్యలో ఒక తీవ్రప్రయాస గంటి (అదే దనంగా): ఒక తిత్తి
గుర్రిక్క ఇంత విడువక ఊదె—వానికాళ్లు ఊరక......

"కంచికి బోత దం టలశికండిది! కంచెము తీసు కొణ్ణె కొ
ట్టించుక సేస్త దంట పడెడేసి పలాములు! బూదెవోమ్మ మం
టాంచనలేక శెప్పితి; ఇవోకము లే దటె! అమ్మవార్ని శే
యించుక వస్త దంట!" అని యెన్నను మూ... ౭౮

౭౮. ఆశఖండిది (తిట్టు) కంచికి పోతుం దట! కుంచెడు (బియ్యము) తీసుకొని ఆడనే కొట్టించుక (=దంపించుకొని) పడెడేసి (=1½ సేరుకొల) వ్యర్థము చేస్తుం దట! బూడిదలో హోమమని వంచనలేక; చెప్పితిని వివేకము లేదా? అమ్మవారిని సేవించుకొని వస్తా నంటుంది.

"కాసికి బోయి కమ్మనగ కాయిడి తెచ్చినవోరిపాపముల్
పాసట! మొన్న యీమదెను పర్రెసతానుల యెంట బోతి నా
కాసికి; రంగనాకుల పకారముకాడ అ దెంత మూక! లా
దాసరిబాపనాం!"డ్లని యదల్చును మూ ... ౭౫

౭౫.........పాయునట! మొన్న ఈమధ్యను పరేశావధానులవెంట ఆకాశికి బోతిని; (అక్కడ) రంగనాయకుల ప్రాకారముకాడ అదెంత ఆదాసరిబాపనవాండ్ల మూకలు (=గుంపులు) !

"నంబి రమాంజు లెంట శినవాడు తమాసగ బోయి సూస్తి, ఆ
కంబముకాడ మొంటికలు కండలు మండెయి; నాటిసుద్ది మా
సంబర మాడిజాతర! గొసంగులు సేసువు లాలకించ నా
కుంబముకాడ పాడి"రని కూయును మూ... ౭౬

"కూడలి సంబరాన మనకోడలు కోయిలా మూకు డేసి ఒ
క్కా డెగిలించి దేవుని పకారములో అనుమూతవాగనా

కాడ సుగాన పాడితె జగారములోపల బాగబెట్టి రం
కేఁడ శిగండిమూకో" అని యొంచును మూ... ౨౨

౨౨. కూడలి (=జనముకూడియుండు చోటు)......కోవెలలో మూకుడు (=మూతగా నుపయోగించు మట్టిశట్టు) వేసి ఒక తాకు వెలిగించి (దీపముపెట్టి), దేవుని పాకార ములోపల భంగపెట్టి రట! ఎక్కడి శిఖండిమూకయో!...

"కంటకురాల, యేంది ఇది! కామచిదీచ్ఛతురాలు ఒణ్ణె పిం
డాంకెలు—పప్పు లోన, కయిడొల్ల—ఇ దెక్కడి ఇత్తుకట్టో! ఆ
కొంటికి పాకనా నెమొ! ఇరిత్తిమొ మారుసి! తీపిశెట్టుపే
రేం టని తెల్సుకో"యనును ఎడ్డెడు మూ... ౨౩

౨౩......కామాక్షి దీక్షితురాలు వండిన పింటివంటలు: పప్పులోనను, పయిన డొల్ల యు-ఇదెక్కడి విత్తనపుకట్టో!......విరిస్తిమా మహారుచి! (ఆ) తియ్యచెట్టుపేరు ఏమి టని తెలుసుకో—అని భార్యకు చెప్పుచున్నాడు......

“ఇసుసుక తింట తియ్యనగ; ఏమిరుశో అది బోగమోల్ల కే
యెరికె! తిరెంగలమ్మ తొలియేకశి కా తిరకోనముందు మా
ఇరియిగ బోసె, దానిశమ యెంతనిసెప్ప! ఒడించె-రంగ! ఆ
కెరెమొద లెంచ నాతరముగా” దను మూ... ౨౯

౨౯............తొలిఏకాదశికి తిరుకోణమందు మహావిరివిగ బోసినది. దానిశ్రమ ఎంతని చెప్ప శక్యము! ఒడ్డించె కరియముదులు (కూరలు-వైష్ణవపరిభాష) ఎంచుటకు...

“గాల్లకు మంద చచ్చుపుడు గజ్జులు వాలుగు మచ్చు కింతపూ
రెల్లదు; నేడు పిత్రిపయోజన మాటవు, కాశిబోట్లు, మా
మల్లని కీరి కట్టె నహు మడ్డది తెల్లనిసీల్లులేక; శే
షే ల్లిటు రాని సత్త”డని ప్రేలును మూ... ౩౦

౩౦. గాలు (=పశువులకు వచ్చుగాలిజబ్బు)లకు మంద చచ్చి...వచ్చునకు ఇంత పూరి (గడ్డి) కల్కద; కాశీభట్లూ, నేడు పితృప్రయోజన మంటావు. మామల్లడు

అను వానికిన్ని. వీర అనుదానికిన్నీ అట్టైనదుము పడినగి.—తెల్లనినీళ్ళు (మజ్జిగనీళ్ళు) లేక;......

“రోసినత్తొత్త, యేం దిది! పురోయితు లెట్టినకూర గబ్బు! ఆ మీాసరపోత్రో, రొయ్యి, కొఅమీానో, సొరో, వుపుశాపో, చొచ్చెమల్ గో. సుడిపకొ—, వాలగొ, సెగో—ఇది తె స్తివి!—బాపనారి అ ప్పాసులు నేతితియ్యా”నని పల్కును మూ... ౮౧

౮౧............పురోహితుం పెట్టిన...గబ్బు (=సువాసన) ఆమీాసరపోలో... సెగో(చేపలపేర్లు) బాపనవారి అప్పచ్చులు నేతిం తియ్యన...

“వా రవి లిప్పన గములో! పుప్పరస ఘుమొ! ఇస్తరాకు లీ బారను యెన్ని యే స్తరు నిబన్నిగ సెప్పు? తలోకి లెంట ఓ పారి తయారు శేస్తె ఒకపాలప్పు; యాట పనాళ్ళ కిత్తు; మీా కోరినయట్ల ఉిస్త” నని కూయును మూ... ౮౨

౮౨. ఎవ రది ?— విపి్రసంఘములా ఉప్పరసంఘమా? ...నిబద్ది (=నిజముగా) తల
వాకిలివెంట ఒకపారి (ఒక పర్యాయము)...యాట(= ప్రతిసంవత్సరమున్నా
"వాశిగ పెడ్లిబాతి బవ్వుబత్తిగ సాదరి బెట్టె సొప్ప క
ట్టెశి కుకుండబెట్టి; అదె నివ్వారివంటక మెట్టి పైన ప
ప్పొ శొకయేలు ముంచి పడబోసితి నై; చరిగా నె వొక్క-డక
శేశితి వంక రుట్టె!" నని చెప్పును మూ... ౮౩

౮౩.........చావరి...చొప్పకట్టవేసి కూకుండబెట్టి నివ్వరి (ధాన్యము) వంటకము
పెట్టి పైన పప్పుపోసి ఒకవే్రలు ముంచి పడబోసితి నెయ్యి.....వంకరపుట్టె...
"పరుగున వచ్చి సూడు ఇది పాడుపిసాసి! అమాసపూట ఇ
స్తరి లోకవోర సించి సిరిసిం దిదిగో దిని బొందబెట్ట! ప
మెరగవు ఆనపచ్చుడిని మొకటదోసులబార్రె మెట్టెం;-ఆ
సరి సయిగానె వ్వూట" దని సాటును మూ... ౮౪

రాఠ.........విస్తరిలో ఒకయోర చించి......ఇదిగో దీనిని బొంద(లో) బెట్టు! ఏమీఎలుగవు. ఆనపపచ్చడిని వెంకటజోస్యుల భార్య పెట్టె. ఆ సరియే చవిగానే ఉంటాది....

"అనువుగ ఇంట సీమ శిటు కంటనె ఒంటక మోసి బూరెలే వన మనసార బెట్టుగద! పాప మ దొక్కటి పాడుబుద్ధి! బాపనిది శినాడిపెండ్లి కొకపైకము దీసుక చాల దంట మా గొనిగ సిగండిబండ!" అని కూయును మూ...

రాగి

రాగ.........బాపనిది (బ్రాహ్మణిది) చిన్నవాని పెండ్లికి............

......మహాగొణిగ..........

"తలదిపకార మోసుకొంయి తానును ఎక్కడి యంగలేసునో తెలను! సెనార మంట! నెయిత్తిర్లక లంట! ఉపాస మంట! అ

య్యాలకు తలాకు లంట! ఇది యాందముగా దని సెప్పి; తిందు మా
కులమునగాని శాత"లని కూయును మూ... ౮౭

౮౭. తలదిగి బార మోసుకపోయి తాగుతాడు. ఎ...శనివార మంట! సెయ్యి (తోం
బెట్టిం) తిరువళిక (దీపము) లంట! ...తలియూకు (విస్తరాకు) లంట! ......సెప్పితి;
వినదు మాకులమునంగాని చేతలు......

"ఎలిపెరుమాళ్ళసంబర మ దెన్నడు సూడలె! ఏమి ఉంతు!మా
గలగిరిబోగమోల్లు, పయి కమ్మగ బూరగు లూదెవోల్లు గుం
పులో తెగగాల్చెవోల్లు, మరి కొబ్బెర-బెల్లము లమ్మె వోల్లు మా
తెలిసినవోల్లకే తెలుసు దేము" డటంగారు ౮౮

"జోసుడు మొన్న గేబలము సూటిగ సెప్పె; మనింటి దాన్ది మా
సూసె; బమైనమూాత్ర మట! సోతెట నచ్చుతరం! మరందుల్లో

మేసములో ఇరి ద్దట! వ్రమేసరబొ ట్లదివాంగడం సరే
మాసదినా" రటందురు ప్రమత్తులు మా... ౮౦

౮౮......గ్రహబలము.......మన ఇంటిదాని (భార్య) ది మహాచూచెను. బలమైన ముహూర్తమట! చాతి యట నక్షత్రము! మరి అంకలో క్షేమములో వృద్ధియట! .... మహాచదివినవారు....

"సామిదరోగ మంట!–మనస త్తి వెగాదిగ సూశి శేతులో
తామరపద్ద ముండ దట! దానికి కిందియి మీదియన్నియే
మే మని లెక్కసూసి పిల లింద రటం టని సూపి దాందినా
కే మరిబాగ సెప్పె"నని యెన్నును మా... ౮౯.

౮౯. సాముద్రికయోగ మంట!– మనస త్తి (అనునామె)ది (చేయి) చూచి....తామర పద్మ మున్నదట! దాని (ఆతామర పద్మముయొక్క) క్రిందివి మీదివి అన్నియు ఏమి ఏమి అని లెక్కచూచి పిల్లలు ఇందరు అని చాంగి (దానినిగూర్చి)........

“గురియట పేడశారమట!కొయ్యలో త్రైదెడుతిర్లకంట!ఇ
ద్దరు తిరుసున్న మెట్టుకొని దాదిని బెట్టి ర టొక్కజాము కం
టరమితి పూలు వొణ్ణి కలటంటనె మేలుక సెప్పె బాగ్యా! మా
గురి ఒయిది దప్పు”దంట తెగగూయును మూ... ౯౦

౯౦. తప్పక జరుగునట! ప్రాణాచారమట!కో వెలలో త్రైదెడు (=ప్రమిదెడు)తిరువలిక (దీపము) అట, ఇద్దరును తిరుచూర్ణము పెట్టుకొని.......కల అట అంటనే మేల్కొని చెప్పె భాగ్యము.

తొల్లిసమందరా లగిశితుంను తమాం మెగబీల్చె నంట! మా
తెల్లము గింటి బాపుశెపితే;కిటు కొక్కట్: నారసీము
పల్లున మోసె బూమిని నిబద్దిగ సెప్పును; బైనిడా, అదే
సల్లని వాకు శెప్పు”మను సారెకు మూ... ౯౧

౯౧. పూర్వము సముద్రాలు అగస్త్యుడు....మహాతెల్లముగా (=స్పష్టముగా) వింటిని బాబుచెప్పితే........నారసింహుడు ఒక పల్లుమీద........

"స ద్దటు కాశికాంయిడికి సన్నపుదూదెకు నారగట్టె మా
ప్పొద్దున యీనెవాద్దె మని మూల్గుత గొన్ను నదే ముమాదమో!
గిద్దెడు గింజలియ్యా తల గింగురు మంటది! వాగ కూర కీ
కొద్దిని బోడ"టందు రలకూళలు మూ... ౯౨

౯౨. సద్దియట్టు (చద్దివలె) కాశీకావడికి........మాపుపొద్దున వీణావాద్య మని........ అదేమి ఉన్మాదమో........

"సంగితకాడ, పాడ కిక సాలిచు! నీ వది పాడినందుకుఁ
ఇంగిత మెంచి నేను మరి యున్నదుకుఁ సరిపోయె; ఇంటివా?
హంగున నేత లూశినటి యప్పుకు తంబుర యీడ మెట్టిపో
బంగుడుబాపనాడ"యని వాగును మూ... ౯౩

"ఊరినడీదిబా యొడున ఊపిది బూ, సానమాల లేసి, ఇ
ద్దేరితి యంట కూకొని వినేసుకు నీ లెగజల్లి గొన్గి యే
లూరికె తిప్పి, శేసరిసి ఊరికి గాతలు పన్నె; ఈని బై
శారగ గొట్ట" మందురు జడాత్ములు మూ... ౯౮

౯౮ ఊరినడివీధిబావియొద్దున విభూతి బూసి వనమాలవేసి........ఇనేకుకు
నీళ్ళు ఎగజల్లి గొణిగి వేళ్ళు ఊరక తిప్పి చేయి చరచి ఊరికి అరిష్టములు తెచ్చె వీని
భవిష్యమార........

"ఎగమడతారు సీరలకు యీదిమ డూరికె యేమి నాన్నెమో!
త్రాగరలె ఇప్పి సూసుకొని దొబ్బిరి ముచ్చవలాలు మూడు; మా
షాగరెశినాది యీరలకు! బూసన మం టది యేమి శాత్రమో!
తగలెయ దానిదీసి" యని తక్కను మూ... ౯౯

౯౫. వీధినిబడి ఊరకేచీరలకు ఎగబడతారు ఏమినాణెమో! తొగరు (దారపు అని) అని విప్పి చూచుకొని....మూడు ముచ్చవలాలం (మూడుచవలాలు—చవలము= వరహాలో ౧ వ (భాగము)........

"పార్వతితోడఁ గూడి బలుపట్టపురాజులు సన్నుతింపఁగా
శార్వరినాడు లేచి సుమ శోభనపుష్పవనంబులోన నా
సార్వవిభుండు శంభుఁడు సుసాయకహస్తుఁడు నన్ను గాంచు మీ
పర్వమునందు విష్ణుయుత పార్వతిదేహుఁడ, చంద్రశేఖరా.

---

శ్రీ ముస్నంగి శర్మగారి పరిష్కృతములు.

# భాషీయ దండకము.

తెలుగు, హిందూస్థానీ, కన్నడము మున్నగు జాతీయములతో పారిభాషికములతో హాస్యము ప్రధానముగ వ్రాయబడిన ప్రాచీనగ్రంథము. కర్నూలుమండల వాసియగు బ్ర॥శ్రీ గండ్లూరు నరసింహశాస్త్రి విరచితము. గ్రంథప్రాశస్త్యము చదివి గ్రహింపుడు. టిప్పణసహితము. వెల 0—2—0.

---

# ఉద్భ్రాంత స్వప్నము.

శ్రీ రవీంద్రనాథటాగూరుగారి Shattered Dream నకు తెనుగు. అనిర్వాచ్యమగు ప్రేమను ప్రకటించు చక్కని కథ. చదివినకొలది చవులూరును. కర్త అనుమతినిఁబొంది అనువదించి ప్రకటించితిమి. వెంటనే ఆర్డరులు బుక్కుచేసికొను వారికి పోస్టేజి తగ్గును. వెల 0—2—0.

వలయువారు:—రామా అండ్ కో., ఏలూరు.

"గురియట పేడశారమట! కొయ్యలొా తైదెడుతిర్లకంట! ఇ
ద్దరు తిరుసున్న మెట్టుకొని దాని బెట్టి ర టొకౄజాము కం
టరమితి పూలు వొాణ్ణి కలటంటనె మేలుక సెప్పె బాగ్యె! మా
గురి యిది దప్పు" దాట తెగగూయిను మూ... ౯౦

౯౦. తప్పక జరుగునట! పాణాచారమట! కొవెలలొ తైదెడు (=ప్రమిదెడు) తిరువళిక
(దీపము) అట, ఇద్దరును తిరుచూర్ణము పెట్టుకొని.......కల అట అంటనే మేల్కొని
చెప్పె భాగ్యము.

తొల్లిసమందరా లగిశితుంను తమాం మెగబీల్చె నంట! మా
తెల్లము గింటి బాపుశెపితే;కిటు కొక్కొటీ: నారిసీము తో
పల్లున మోసె బూమిని నిబద్దిగ సెప్పారు; బైనిడా, అదే
సల్లని వాకు శెప్పు" మను సారెకు మూ... ౯౧

౯౧. పూర్వము సముద్రాలు అగస్త్యుడు....మహా తెల్లముగా (=స్పష్టముగా) వింటెని బాబుచెప్పితే........నారసింహుడు ఒక పల్లుమీద........

"స ద్దటు కాశికాయిడికి సన్నపుదూదెకు నారగట్టె మా
ప్పొద్దున యీ నెవాద్దె మని మూల్గుత గొన్గు సదే ముమాదమో!
గిద్దెడు గింజలియ్య తల గింగురు మంటది! వాగ కూర కీ
కొద్దిని బోడ"టందు రలమూళలు మా... ౯౨

౯౨. సద్దియట్టు (చద్దివలె) కాశీకావడికి........మాపుపొద్దున వీణావాద్య మని........ అదేమి ఉన్మాదమో........

"సంగితకాడ, పాడ కికసాలిచు! నీ వది పాడినందుకుర్
ఇంగిత మెంచి నేను మరి యున్నదుకుర్ సరిపోమొ; ఇంటివా?
హంగున నే త లూశినటి యప్పుకు తంబుర యీడ మెట్టిపో
బంగుడుబాపనాడ"యని వాగును మా... ౯౩

"ఊరినడీదిబా యొడున ఊపిది బూ, సానమాల లేసి, ఇ
ద్దేరితి యంట కూకొని విసేసుకు నీ లెగజల్లి గొన్గి యే
లూరికె తిప్పి, శేసరిసి ఊరికి గాతలు పన్నె; ఈని బై
శారగ గొట్ట" మందురు జడాత్మలు మూ... ౯ర

౯ర ఊరినడివీధిబావియొడ్డున విభూతి బూసి వనమాలలేసి........ఇనేసుకు
నీళ్ళు ఎగజల్లి గొణగి వేళ్ళు ఊరక త్రిప్పి చేయి చరచి ఊరికి అరిష్టములు తెచ్చె వీని
భవిష్యమార........

"ఎగమడతారు సీరలకు యీాదిమ దూరికె యేమి నాన్నెమో!
తొాగరబె ఇప్పి సూసుకొని దొాబ్బిరి ముచ్చవలాలు మూాడు; మా
పొాగరెశినాది యీారలకు! బూాసన మం టది యేమి శాాత్రమో!
తగలెయ దానిదీసి" యని తక్కును మూా... ౯గి

౯౫. వీధినిబడి ఊరకే చీరలకు ఎగబడతారు ఏమినాణెమో! తొగరు (దారపుచీర అని) అని విప్పి చూచుకొని....మూడు ముచ్చవలాలు (మూడుచవలాలు—చవలము= వరహాలో ౧ వ (భాగము)........

"పార్వతితోడఁ గూడి బలుపట్టపురాజులు సన్నుతింపఁగా
శార్వరినాడు లేచి సుమ శోభనపుష్పవనంబులోన నా
సార్వవిభుండు శంభుఁడు సుసాయకహస్తుఁడు నన్ను గాంచు మీ
పర్వమునందు విష్ణుయుత పార్వతిదేహుఁడ, చంద్రశేఖరా.



